శ్రీరస్తు.

బమ్మెరపోతనామాత్యప్రణీత

శ్రీమదాంధ్ర మహాభాగవతము నందలి

# సప్తమస్కంధము.

ఇది,

తెనుఁగుభాషఁజదువుకొను బాలురకు

నత్యంతోపయుక్తంబగునటుల

అల్లాడి- నారాయణశాస్త్రులుగారిచే

బరిష్కరింపఁబడి

రామానందముద్రాక్షరశాలయందు.

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపురి,

1904

శ్రీరామానంద ముద్రాక్షరశాలయందు విక్రయించు

పుస్తకముల జాబితా.

| | |
|---|---|
| సేనానీవిచరిత్రము | ౦ ౩ ౦ |
| గురుబాలప్రబోధిక | ౧ ౮ ౦ |
| తె॥ ఇంద్రసభా | ౦ ౫ ౦ |
| సుజ్ఞానామృతతారావళి | ౦ ౪ ౦ |
| పురశ్చరణదీపిక | ౦ ౪ ౦ |
| అష్టోత్తరసహస్రనామకదంబము | ౦ ౮ ౦ |
| స్కాందమాఘపురాణం | ౦ ౮ ౦ |
| కాలామృతం | ౦ ౪ ౦ |
| నక్షత్రచూడామణి | ౦ ౪ ౦ |

పాకెట్టు రాయల్ ౩౨ పేజీలలో యుండు గ్రంథములు

| | |
|---|---|
| విష్ణుసహస్రనామము | ౦ ౭ ౦ |
| లలితాసహస్రనామము | ౦ ౬ ౦ |
| శివసహస్రనామము | ౦ ౬ ౦ |
| భగవద్గీత భారతసావిత్రోపాఖ్యానం బ్రహ్మసూత్రం | ౦ ౮ ౦ |

ఇవి మొదలైన అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు సరసముగా విక్రయించబడును పోస్టుచార్జి ప్రత్యేకము,

ఇట్లు

అల్లాడి - హయగ్రీవశాస్త్రి

రామానంద ముద్రాక్షరశాల

చాకలపేట పోస్టు.



శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర మహాభాగవతము.

## సప్తమస్కంధము.

శ్రీమద్విఖ్యాతిలతా । క్రామితరోదోంతరాళకమనీయమహా । జీమూతతులితదేహా । శ్యామలరుచిజాలరామచంద్రనృపాలా ॥

వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రునవలోకించి ॥ సీ॥ సర్వభూతములకు సముఁడునై చెలి ప్రియుండునైన వైకుంఠుఁడనంతుఁడాఢ్యు । డింద్రునకొఱకునై దైత్యేంద్రులనేటికి విషమునకైవడి వేఁకిచంపె ॥ సురలజంపంగ నసురులచేదనకయ్యెడిలాభమెంతైనగలదె । నిర్వాణసుఖంబున నిర్గుణుండగు తనకసురులవలనిభయంబుపగయు గలుగనేరనట్టి ఘనుడు దైత్యులజంపి । సురలఁగాచుచునికి చోద్యమనుచు । సంశయంబు నాకు జనియించె మునినాథ । యజ్ఞమెఱసి తెలియబలుకవయ్య । అనిన శుకుండిట్లనియె శా॥ నీసంప్రశ్నము సన్నుతింపఁదగు నా నిక్కంబు రాజేంద్ర । లక్ష్మీసంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁద । ద్దాసాఖ్యానములో ప్రవిష్ణుచరణాఖ్యానప్రధానంబులై । శ్రీనందాదములయి మునీశ్వరవచోజేగీయమానంబులై ॥ క॥ చిత్రంబులు త్రైలోక్యప । విత్రంబులు భవలతాలవిత్రంబులు స । న్మిత్రంబులు మునిజనవన । చైత్రంబులు విష్ణుదేవుచారిత్రంబుల్ । వ॥ నరేంద్రా కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు సెప్పెద వినుము అవ్యక్తుండుగాక గుణంబులు లేక ప్రకృతిం జెందక భవంబులనొందక పరమేశ్వరుండు తనమాయవలనైన గుణంబులనావేశించి బాధ్యబాధకత్వంబులనొందుచుండు గుణరహితుండు సత్వరజస్తమంబులు ప్రకృతిగుణంబులు లాగుణంబులకు నొక్కొక్క కాలంబున హానివృద్ధులుగలవా యీశ్వరుండు సత్వంబున దేవఋషులను రజోగుణంబున నసురులను దమోగుణంబున యక్షరక్షోగణంబులను విభజించె సూర్యుండు పెక్కుడలంగానంబడియు నొక్కరుండైన తెఱంగున నవద్విభుండును సర్వగతుండయ్యును భిన్నుండుగాడు తత్వవిదులైనపెద్దలు తమలోనం బరమాత్మస్వరూపంబునను న్నయీశ్వరుని నివ్విధంబున నెఱుంగుదురు జీవాత్మకుబరుండైన సర్వమయుండు తనమాయచేత వి

శ్వంబు సృజియింపం గోరి రజంబును గ్రీడింపం గోరి సత్త్వంబును నిద్రింపం గోరి త
మంబును త్పాదించి చరమైన కాలంబును సృజియించుచు నా కాలమున సర్వదర్శ
నుండైన యీశ్వరుండు కాలాహ్వయుండైన సత్త్వగుణంబైన దేవానీకంబునకు
వృద్ధియు రజస్తమోగుణులైన రాక్షసులకు హానియుం జేయుచుండు॥ క॥ జన
నాయక యీ యర్థము । ఘనయశుఁడగు ధర్మజునకుఁ గ్రతుకాలమున । న్మును
నారదుండు సెప్పెను । వినుపించెద వినుము చెవులు విమలత నొందన్॥ వ॥ ము
న్ను ధర్మరాజు సేయు రాజసూయయాగంబున బాలుండైన శిశుపాలుండు హ
రి నిందించిన నిశితనిర్వక్రచక్రధారాదళితమస్తకుండయి తేజోరూపంబున వ
చ్చి హరిదేహంబు సొచ్చుటం జూచి వెఱఁగుపడి ధర్మజుండు సభలోనున్న నార
దునీక్షించి యిట్లనియె॥ గీ॥ ఏట్టివారికైన నేకాంతులకునైన । వచ్చి చొరఁగ
రాని వాసుదేవతత్త్వమందుఁ జేరి ధరణీశుఁడహితుఁడై । యెట్లు చొచ్చె మునివరే
ణ్యా నేడు॥ ఉ॥ వేనుఁడు మాధవుం దెగడి విప్రులు దిట్టిఁ భగ్నుఁడై తమో । లీను
డుగాఁడె తొల్లి మదలి పుడు చైద్యుడు పి[illegible]టకుం । డేయు మాధవుస్వనస
హింపఁడు భక్తి వహింప డట్టివాఁ । డెని[illegible]డ ప్రభావమున నీపరమేశ్వరునందు జొ
చ్చెనో॥ మ॥ హరి సాధింతు హరిన్ గ్రహింతు హరి బ్రాణాంతంబు నొందింతు దా
హరికి నైవైరినటంచు వీడుపటురోషాయత్తుడై యెప్పుడున్ । దిరుగుం ద్రుళ్ళుపడు
నొరు ద్రీలిపడదో దేహంబు దాహంబుతో । నరకావాసము నొంద దేక్రియ జగ
న్నాథుం బ్రవేశించెనో ॥వ॥ అదియునుం గాక దంతవక్త్రుండును వీఁడును నిరం
తరంబు గోవిందునింద సేయుదురు నిఖిలజనులు సందర్శింప నేఁడు వీరికి విష్ణుసా
యుజ్యంబు గలుగుట కేమి హేతువు వినిపింపుము పవనచలితదీపశిఖయుం బో
లె నా హృదయంబు చలించుచున్నదనిన ధర్మనందనునకు నారదుండిట్లనియె॥
దూషణభూషణతిరస్కారంబులు నశరీరంబునకుం గాని పరమాత్మకు లేవు శరీ
రాభిమానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున నే
ను నా యదీయం బను వైషమ్యంబు భూతంబులకు శరీరంబునందు సంభవించు న
భిమానంబు బంధంబు నిరభిమానుండై వధించిన వధంబు గాదు కర్తృత్వ మెల్ల
వానికి హింసయు సిద్ధింపదు సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైష
మ్యంబు లేదు గావున ॥గీ॥ అలుకనైన జెలిమినైన గామంబున । నైన బాంధవ
మున నైన భీతి । నైన దగిలి తలప నఖిలాత్ముఁడగు హరి । జేరవచ్చు వేఱు సేయఁడత
డు ॥క॥ వైరానుబంధనంబున । జేరినచందమున విష్ణుఁ జిరతరభక్తిం । జేరఁగ
రాదని తోఁచును । నారాయణభక్తియుక్తి నాచిత్తమునన్॥ క॥ కీటకము దెచ్చి

భ్రమరము | పాటవమునఁ బంభ్రమింపభ్రాంతంబైతే | కీటకము భ్రమరరూపము | పాటించి వహించుఁగాదె భయయోగమునన్ ॥ ఇవ్విధంబున. శా॥ కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియన్ | సాత్మగ్రిన్నిత్తుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్ | ప్రేమన్ మీరలు భక్తి నేము నిచటన్ క్రింగంటిమెల్లైనను | ధ్యానాధ్యాసగరిష్ఠుడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా॥

శ్రీహరిద్వారపాలకులగు జయవిజయులకు సనంద
నాదులవలన శాపంబునం భవించుట.

వ॥ మఱియుం బెక్కండ్రు కామద్వేషభయస్నేహసేవాతిరేకంబులం జిత్తంబు హరిపరాయత్తంబుగాఁ జేసి సద్గతిం జెందిరి వైరిచుదేశించి క్రోధాముత్తలేనింటిలోపల నొక్కంటియైన వెన్నునికి లేనినిమిత్తంబున నతండు వధ్యుండయ్యెనితల్లి చెలియలికొడుకులైన శిశుపాలదంతవక్త్రులు తొల్లి విష్ణుమందిరద్వారపాలకులు విప్రశాపంబున భ్రష్టులై భూతలంబున జన్మించిరని వవి యుధిష్ఠిరుండు నారదునకిట్లనియె॥ మ॥ అలుగంగారణమేమి విప్రులకు మాన్యాత్ములె విప్రులెవ్వారలని | ర్మలులే కారొతు నిర్జితేంద్రియులు నిస్సంగాత్ములే గానువత్తులు వైకుంఠపురీనివాసుల నవిందున్ వారి కెబ్బంగిని | ఖిలజన్మంబులు వచ్చె నారదవినం గౌతూహలం బయ్యెడిన్॥ వ॥ అనిన నారదుండిట్లనియె నొక్కనాడు బ్రహ్మమానసపుత్రులైన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబునందును సంచరించుచు నైదారేండ్లప్రాయంపు బాలకులభావంబున దిగంబరులయి హరిమందిరంబునకు వచ్చి చొచ్చునెడ మొగసాల నున్న పురుషులిద్దరు వారలంజూచి॥ క॥ డింభకులని నగుచు వి | ప్రాంభకులర మాధి రాధనల్లాపసుఖారంభకులము క్తమహాసద్రాంభకులం జొరగనీక తలమిరధిశా॥ క॥ వారించిన దమకంబున | వారించుక నిలువలేక పడిదిట్టిరిదా | వారికులనసురయోనిన | వారితలై పుట్టుడనుచు వసుధాధీశా॥ వ॥ మఱియు నాపిన్నపెద్దలు వారలంజూచి మీరలిద్దఱునుం సహరిలుగారు నారాయణచరణమూలంబు విడిచిరజస్తమోగుణులజవరాక్షసయోనింబుట్టుడని శపియించిన నాశాపవశంబున భ్రష్టులై కూలుచు మొరలిడిన నమ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱ నంగరుణించి మూడుజన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడునని నిర్దేశించిచని రివ్విధంబున శాపహతులై హరిపార్శ్వచరులైన పురుషులిరువురు హిరణ్యకశిపుహిరణ్యాక్షులన దితికి జన్మించిరందు గనిష్ఠుండయిన హిరణ్యాక్షుని హరి వరాహరూపంబున సంహరించె నగ్రజుండయిన హిరణ్యకశిపుం డును నరసింహమూర్తియైన శ్రీ

సంస్మరణంబున యోగవియోగంబులనొందించుచుసంభవవినాశశోకవివేకావివే
కచింతాస్మరణంబులువివిధంబులీయర్థంబు నకు బెద్దలుప్రేతబంధుయమసంవా
దంబను నితిహాసంబునుదాహరింతురు వినుండు సెప్పెద నుశీనరదేశంబునందు సు
యజ్ఞుండను జగలండతండు శత్రువులచేత యుద్ధంబుననిహతుండై యున్నయె
డ| సీ॥ చినిగినబహురత్నచిత్రవర్మముతోడ రాలినభూషణరాజితోడ భీకరబా
ణనిర్భిన్నవక్షముతోడ| దఱుచుగారెడుశోణితంబుతోడ|గీఱ మైజారినకేశబం
ధముతోడ రయరోషదంష్ట్రాధరంబుతోడ| నిమిషహీనంబైననేత్రయుగ్మము
తోడ భూరజోయుతముఖాంబుజముతోడ| దునిసిబడినదీర్ఘదోర్దండములతో
డ| జీవరహితుడగునుశీనరేంద్రు| జుట్టిబంధుజనులుసారదినుండగభయక్రాం
తలెల్ల॥ శా॥ ప్రస్తాకంపితకేశబంధములతో సంఛిన్నహారాళితో| హస్తాబ్జంబు
లుసాచిమోదికొనుచుర్ హాహానాథయంచున్ప్రహా | ప్రస్తావోక్తులతోడ నేడ్చిరివ
గర్ బ్రాణేశుపాదంబుపై| నస్తోక స్తనకుంకుమారుణవికీర్ణాస్రంబువర్షించు
చున్॥ మ॥ అవస్థ నిన్నుశీనరప్రజలకర్థానందసంధాలుగా|మునునిర్మిం
చినబ్రహ్మనిర్దయతనునూలించె నేవీరికి| ద్నసయుక్రేణికి మాకుదిక్కుగలదే ధా
త్రీశ నీబోటికిం | జనునే పాసి చనంగ భృత్యప్తములన్ మిత్రుల బుత్రులన్॥
మ॥ జనలోకేశ్వర నిన్ను బాసిననిమేషంబుల్ మహాబ్దంబులై| చనులోకాంతర
గామివై మఱలకీచందంబునన్నీవుపో|యిరనెబ్బగిజాతుమెల్లముగదాయీ
లోకవృత్తంబునే| డపలజ్వాలఁ జొచ్చివచ్చెదము నీయంఘ్రిద్వయంబుంజూడగన్
వ॥ అనియిట్లురాజభార్యలారాజశవంబుడగ్గఱివిలపింప ప్రొద్దుగుంకెడుసమ
యంబునవారులవిలాపంబులవిని బాలకుండై యముండుసనుదెంచి ప్రేతబంధు
లంజూచియిట్లనియె॥ ఉ॥ మచ్చికవీరికెల్లబహుమాత్రము చోద్యము దేహపుట్టు
చు| న్జచ్చుచునుండజూచెదరు చావునకొల్లడగవచ్చునే వెచ్చటబుట్టినచ్చటికి
నేగుటనైజము ప్రాణకోటికిన్॥ క॥ జననీజనకులబాసియు|ఘనవృకములబాధప
డకగడుబిన్నలమే| మనియెద మెవ్వడుగర్భంబునమునుబోషించె వాడెపోషకు
డడవిన్॥ క॥ ఎవ్వడుసృజించుప్రాణుల| నెవ్వడురక్షించుద్రుంచు నెవ్వడనంతుం
డెవ్వడువిభుడెవ్వడువా| డివ్విధమ నమనుచుబెనుచు హేలారతుడై॥ గీ॥ ధనమువీ
ధిబడినదైవవశంబున| నుండబోవుమూలమున్నైన|నడవిరక్షలేనియబలుం
డువర్ధిల్లు|రక్షితుడుమందిరమునజచ్చు॥ క॥ కలుగునుమఱిలేకుండును| గలభూత
ములెల్లగాలకర్మవశములయి|నిలువండు ప్రకృతిందద్గుణకలితుడుగాడాత్మ
మయుండగమ్యుడు దలపన్॥ సీ॥ పాంచభౌతికమైనభవనంబు దేహంబుపురు

హైనవిధి నేమందుఁ॥ ఉ॥ ఆఁకటఁ బొరవు పిల్లలకు నాఁపటిను డియుమేతగానమిఁ
బొక్కుచు గూటిలో నెగసి పోవఁగ నేరవు మున్న తల్లియో। దిక్కున నుండి వచ్చిన
న। త్రిప్పని చూచుకొనిక నిక్కి నల్దిక్కులు చూచుచున్న వతిదీనత నెట్లు భరింతు
నక్కటా॥ అని విర్వథంబున॥ క॥ కుంఠిత వాదము తోడను। గంతము శోషింపఁబడఁగ చు
ఖగము విహాననో। తంత్రుండై నకిరాతుడ కంఠిరగతి నేసెఁ బాకక కోలం ధరగూ
ఱెఖగము ఘోషముతోడఁ। గాలము డాసిన నేలగూలక పోవశమె యెట్టి గుణవం
తులకుఁ॥ ఉ॥ గావున మీరు చచ్చుతరి గానరు చచ్చెదరి త్రిబద్ధ శా। త్రివిధ దేహముం
గడిసి దీనత నేడువ నేల పొందుచి। తావతులార వత్సర శతంబులకైనను జేసు చక్కఁ
గిం। బొప్పుట దుర్లభంబు మృతిఁ బొందిన వారలు సేరవత్తురే॥ వ॥ అని యిట్లు కపట బా
లకుండైన క్రీడించుచున్న యముని యుపలాలనాలాపంబులు విని సుయజ్ఞుని బంధు
వులెల్ల వెరగుపడి సర్వప్రపంచంబు నిత్యంబు గాదని తలంచి శోకంబు మాని సుయ
జ్ఞుని సాంపరాయిక కృత్యంబులు సేసి చనిరంత నంతకుండంతర్హితుం డయ్యె నని చె
ప్పి హిరణ్యకశిపుండు దనతల్లిని దమ్ముని భార్యలం జూచి యిట్లనియె॥ క॥ పరులెవ్వ
రు దా మెవ్వరు। పరికింపఁగ నేక మగుట భావింపరు త। త్పరమ మనజ్ఞానము తేమిని। బ
రులును మేమనుచు దోచు ప్రాణుల కెల్లన్॥ వ॥ అని తెలియఁ బలికిన హిరణ్యకశిపుని
వచనంబులు విని దితికోడండ్రును దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలి
గిలోకనంబు గలిగి లోకాంతరగతుండైన కొడుకునకు వగవక చనియె నని చెప్పి నా
రదుండు ధర్మనందనున కిట్లనియె॥ క॥ అజరామర భావంబును। త్రిజగద్రాజ్యంబు
న ప్రతిద్వంద్వము దో। ర్విజితాఖిల శాత్రవమును। గజరిపుబలమును హిరణ్యకశి
పుఁడు గోరెన్॥ వ॥ ఇట్లు గోరి మందరాచల ద్రోణికిం జని యందు గాలి పెను వ్రేల నేల
నిలువంబడి యూర్ధ్వబాహుండై మిన్ను జూచుచు వాడిమయూఖంబులతోడి
ప్రళయకాలభానుండునుం బోలె దీర్ఘ జటారుణ ప్రభాజాలంబులతోడ నెవ్వరికిం
జేరి జూడరాక పరమదారుణంబైన తపంబు సేయుచుండె నిర్జరులు నిజస్థానంబున
నుండిరంత॥ మ॥ అదరెం గుంభిని సాద్రియై కలఁగె నేడంభోనిధుల్ తారకల్। ల్చెదరెన్
గ్రహసంఘములై దిశలు విచ్చి వ్రాంతలై మండెదెల్లఁ గరెఁ గుండెలు జంతుసంహ
తికి నుగ్రాకార దైత్యేంద్ర మూర్ధ్న దిశోద్భూత సధూమ హేతిపటలోదంచ త్త
పోవహ్నిచేన్॥ వ॥ ఇట్లు త్రైలోక్య సంతాపకరంబైన దైత్యరాజ తపోదహన వి
జృంభణంబు సైరింపక నిలింపులు నాకంబు విడిచి బ్రహ్మలోకంబునకుం జని లోకే
శ్వరుండైన బ్రహ్మకు వినతులై యిట్లని విన్నవించిరి॥ క॥ దితిపట్టి కొడుకు తపము వేడిమి।
నతితపులమై తిమింకనల జడిసి సురా। పతినుండ వెరతుమవ్వేది। గతిమా కిట దేవ

ర్యతారుణ్యసహితుండును వజ్రసంకాశదేహుండు నుదగ్ర ప్రసువర్ణుండును నీరసేం
ధననికరనిర్గతవహ్నియుం బోలె వెలుంగుచు జనుదెంచె। మ॥ వివిజానికనరోధ
క్రమొక్కొ గనివాగ్దేవిమనూనేతకు। స్వవిశేషోత్సవసంవిధాతకు సమస్తంత్రాత
కున్నత్తపో|నివహాభీష్టవరప్రదాతకు జగన్నిర్మాతకున్ దాతకు। న్నివిధప్రాణిలలా
టలేఖదసహావిద్యాసుసంధాతకున్॥ వ॥ ఇట్లు దైత్యేశ్వరుండు దివ్యన్నహా. నవా
హానునకు కరణీతలంబున దండప్రణామంబు లాచరించి సంతోషబాష్పసలిలసం
పరిధ్రుతపులకాకుకుండై యంజలి జేసికొంజగర్భుని నిదద్దృష్టి నిడి గద్గదస్వరంబున ని
ట్లని స్తుతియించె॥ సీ॥ కల్పాంతమున నంధకారసంభృతమైన జగము నెవ్వఁడు స్వ
ప్రకాశ|మున వెలింగించుచు మూడు భంగులర జస్సత్వతమోగుణసహితుఁడ
గుచు|గల్పించ రక్షించు గడపట బ్రహరించు నెవ్వఁ డాద్యుండున హేతుఁడగుచు
శోభితుండై స్వయంజ్యోతినై యొక్కఁడవి ల్లసిల్లు నెవ్వఁడు విస్తతమె సిసమయమై
వమనసప్రాణబుద్ధీంద్రియముల తోడ నెవ్వఁడలఘుమహిమ|నడరునట్టి సచ్చిదా
నందమయుఁడు|మహితభక్తినేనవ స్కరింతు|వ॥ దేవా నీవు ముఖ్యప్రాణంబగు
టంచే సిప్రజాపతిని మనోబుద్ధీంద్రియంబులకు నధీశ్వరుండవు మహాభూతగ
ణంబులకు నాధారభూతుండవు ప్రయాతనువున ంగ్రతువు విస్తరింతువు సకల
విద్యలు నీతనువులు సర్వార్థసాధకులకు సాధనీయుండవు నీవయాత్మనిష్ఠాగరిష్ఠుల
కు ధ్యేయుండ వగు నాత్మకాలముయుడనై జనులకు వాయుర్నాశంబు జేయుదువు
జ్ఞానవిజ్ఞానమూర్తి వాద్యంతరహితుండవు అంతరాత్మవు మూడు మూర్తులకు మూ
లంబగు పరమాత్మవు జీవలోకంబునకు జీవాత్మవు నీవ సర్వంబు నీవ నీవు గాదివి
విలేశ బువ్యక్తుండవు గాక పరమాత్మవై పురాణపురుషుండవై యనంతుండవై
న నీవు ప్రాణేంద్రియమనోబుద్ధిగుణంబుల నంగీకరించి పరమేష్ఠిపదవిశేషంబున ని
లిస్థూలశరీరంబునం జేసి ఇంతయు బ్రపంచింతువు భగవంతుండవైన నీవు మ్రొ
క్కెదనని మరియు నిట్లని యె॥ క॥ కోరిన వారల కోర్కులు|నేనువుత్తో సిచ్చి మను
వసిక్రియ నన్యు| ల్నేరరు కరుణాకరనే| గోరెద నీవిచ్చెదేని గోరికలభవా॥ శా॥ గా
లింగుంభీనిసర్గ్నంబుపుర నాకాస్థలిందికులు| క్రేంఘుప్రములందమః బ్రభల
భూరిగ్రాహరక్షో మృగ| వ్యాఘ్రాదిత్యన రాదిజంతుకల వ్యాప్తిస్సమస్తాస్త్రశ|స్త్రా
ళిన్ ప్రత్యువులేవ జీవనముల్ లోకాధీశ ఇప్పింపవే॥ వ॥ మజీయురణంబులందుదన
కెదురు లేని శౌర్యంబును లోకపాలుర నతిక్రమించు మహిమయును భువనత్రయ
జయంబును హిరణ్యకశిపుండు గోరిన న తని తపంబునకు సంతోషించి దుర్లభంబు
లైనవరంబు లన్నియు నిచ్చి కరుణించి విరించి యిట్లని యె॥ శా॥ అన్యాకశ్యపపుత్ర

దుర్లభములే యర్థంబు లెవ్వారికి। నన్నన్నవారలుగోరరీవరములన్నొసంగించి
తీర్నెయెడ। నన్నుంగోరినవెల్లనిచ్చెద ప్రవీణత్వంబుతో బుద్ధిమం। పన్నత్వం బున
నుండుమీ సుమతివై భద్రైకశీలుండవై వ॥ అని యిట్లు మోఘంబులైన వరంబులి
చ్చి దితినందను చేతం బూజితుండై యరవిందసంభవుండు బృందారకసందోహ
వంద్యమానుండగుచు నిజమందిరంబునకుం జని యె నిర్విఘ్నంబున నిలింపారాతివర
పరంపరలు సంపాదించుకొని॥ క॥ సోదరుజంపినపగకై। యాదరమించుకయు లేక
యసురేంద్రుండు కం। జోదరుపై వైరము దు। ర్భారతరం బగుచు జేసె మనుజా
ధీశా॥ సీ॥ ఒకనాడు గంధర్వయూథంబు పరిమార్చు దివిజులనొకనాడు దెరలదో
లు। భుజగులనొకనాడు భోగంబులకు బాపు గ్రహములనొకనాడు గట్టివైచు। నొ
కనాడు యక్షులనుగ్రతదండించు నొకనాడు విహగులనొడిసిపట్టు। నొకనాడు సి
ద్ధులనోడించి బంధించు మనుజులనొకనాడు మర్దించు। గడిమి నొకనాడ కిన్నర
ఖచర సాధ్య। చారణ ప్రేతభూతపిశాచవన్య। సత్వవిగ ద్యాధరాదుల సంహరించు
దితిసుతుండు దుస్సహతేజుడగుచు॥ క॥ అట్టిత్తోడగొట్లల। గట్టను కం
ద్రోచిక్రవ్యాదులతో। జుట్టువిడిసి దిక్పాలుర। ట్టణములు గొని యొనతఘబలమున
నధిపా॥ క॥ కృశులై సంప్రాపితదు। ర్దశులై సర్వంసభోగ్రదైతేయాజ్ఞా। పశులై నిశలు
ను దివములు। దిశలెల్లను గట్టువడియిది తపనఘా॥ వ॥ మఱియు నద్దానవేంద్రుం
డు విద్రుమసోపానంబులును మరకతమణిమయప్రదేశంబులును వైడూర్యర
త్న స్తంభసముదయంబులును- చంద్రికాసన్నిభస్ఫటికసంఘటితకుడ్యంబులు
ను పద్మరాగపీఠకనకవాటగేహాళివిటంకవాతాయనంబులును-విలంబమానము
క్తాఫలదామవితానశోభితధవళపర్యంకంబులును- వివిధవిచిత్రవిమానంబులు
ను నిరంతరసురభికుసుమఫలభరితపాదపోద్యానంబులును- హేమారవిం
దసౌగంధికబంధురసరోవరంబులును-రమణీయరత్నప్రాసాదవిశేషంబులును
మనోహరపరిమళశీతలమందమారుతంబులును- మృదుమధురనినదకీరకోకిల
కుహూకోలాహలంబులును గలిగి విశ్వకర్మనిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీకో
భితంబైన మహేంద్రభవనంబుజొచ్చి॥ మ॥ దితిపుత్రుండు జగత్త్రయైకవిభుడై
దేవేంద్రసింహాసనో। ద్ధతుడై యుండ హరాచ్యుతాంబుజభవుల్ దక్కంగ భీతిస్సు
యాం। గతులై తక్కినయక్షకిన్నరమరుద్గంధర్వసిద్ధాదులానతులై కానికలిచ్చి
కొలురతనిన్నానాప్రకారంబులన్॥ శా॥ ఏదిక్పాలుర జూచి నేడలుగునో యె
దేవుబంధించునో। యేదిగ్భాగము మీఱదాడిచనునో యేప్రాణులం జంపునో।
యీదయితేశ్వరుడంచు నొండొరులు దారిండ్రాదులాస్థానభూ। వేదిన్మెల్ల

వనిక్కిఁ జూతురుభయాన్వితరోమాంచులై॥ సీ॥ కోలాహలము మాని
కొలువుఁడీసురలార కలిగిదీవించుఁడు తపసులార। ఘనలెత్తకుడునికి సన్నగేం
ద్రములార ప్రణుతులయిననుండు దిక్పాలులార। గానంబుసేయుఁడు గంధర
వులార సంగడిబడకుఁడీ సాధ్యులార। యాడుఁడు నృత్యంబు లప్సరోజను లా
ర చేరిక్రమెక్కుఁడు సిద్ధులార। శుద్ధకర్పూరవాసిత సురభిమధుర। భక్ష్య
నూతనమై లేయపానజనిత। సుఖవిలీనతనమరారిసాక్షి నాఁడు। శాంతిలేదం
ద్రమునిచ్ఛలుఁ జారులధిప॥ శా॥ లీలోద్యానలతానివాసములలో లీలావతీయుక్తు
ఁడయి। హాలాపానవివర్ధమానమదలోలావృత్తతామ్రాక్షుఁడయి। కేళిం దేల
గ నేసదుంబురుఁడు సంగీతప్రసంగంబులు। స్వాగాయంబుగఁ జుంగ జేయురుము
దేవద్వేషి సర్వేశ్వరా॥ క॥ యాగములు బుధులు ధరణీ। భాగములం జేయుచుం
డఁబుజవెంచి హవి। ర్భాగము లదానసైకొనఁ। జాగింపఁడు దైత్యుఁడమరసం
ఘంబునకున్॥ సీ॥ సకలమహాద్వీపనహితవిశ్వంభరాస్థలినిదున్న కవ దుసన్న చ
యమ్ము। కామధేన్వాదులకరణీసర్ధులు గోరుకోర్కులుగగనంబు గురియు మం
డు। వనధులేడును వాహినీసందోహములును వీచులరత్నములు వహించు। ను
త్తరుహాంశులునొక్కకాయంబున ఖిలతున్ గుణములనతిశయిల్లు। సంబుసం
పూరితద్రోణులగుచునొప్పు। బర్వతంబులనద్రిదికాలవివిధ। గుణములెల్లను
దానైతెకొనుచు దైత్య। విభుండసైత్రిలోక్యరాజ్యసంవృద్ధినొందె॥ వ॥ ఇట్లు స
కలదిక్కులనిర్జించి లోకైకనాయకుండయి తనయిచ్ఛాప్రకారంబున నింద్రి
యసుఖంబెల్ల ననుభవించుచుండ నియత్రాస్త్రమార్గంబున నతిక్రమించి విరించి
వరజనితదుర్వారగర్వాతిరేకంబున నుపర్వారాతియై శ్వర్యవంతుండయి పెద్ద
కాలంబు రాజ్యంబుసేయునెడ॥ ఉ॥ ఎన్నఁడు నాదిక్కుఁగలదెన్నఁడు దైత్యునిబా
ధమానమే మెన్నఁడు వృద్ధిఁబొందఁగలమెవ్వఁడు రక్షకుఁడంచు దేవతాకిన్నరసిద్ధ
సాధ్యముని ఖేచరనాయకులాశ్రయించిరా। పన్నగతల్పు భూరిభవబంధవిమో
చన బ్రహ్మ్యలోచనున్॥ వ॥ ఇట్లు దానవేంద్రునియుగ్రదండంబునకు వెఱచియన
న్యశరణ్యులై రహస్యంబెనందఱుంగూడుకొని॥ ఉ॥ ఎక్కడఁ దున్నవాఁడు కగధీశ్వ
రుఁడాత్మమయుండు మాధవుం। డెక్కడికేగి శాంతులు మునీశులు బిక్షులు రారు
క్రమ్మఱం। దిక్కులు నెల్ల నెక్కడఁ దుదింపఁ దిక్కగునట్టి దిక్కకై। మ్రొ
క్కెద మేము హస్తయుగములు మకుళించి మదీయరక్షకున్॥ వ॥ అనిమాఱియునా
హారనిద్రలుమానిచిత్తంబులు పలాయుత్తంబులుగాని సమాహితబుద్ధులై భ
గవంతుండును మహాపురుషుండును మహాత్ముండును విశుద్ధజ్ఞానానందమయుం

డంబోత్తురునత్కవీద్రుల క్రియనూర్భనాథమిబోటన। భగవద్భక్తులైదైత్యరాజ
తనయుం బాటించి కీర్తింపరే॥ క॥ గుణనిధియగు ప్రహ్లాదుని। గుణముల నేకము
లుగలవు గురుకాలమునన్। గణుతింపనశక్యంబులు। ఫణిపతికిన్ బృహస్పతికిని భా
షాపతికిన్॥ వ॥ ఇట్లు సద్గుణగరిష్ఠుండైన ప్రహ్లాదుండు భగవంతుండైన వాసుదే
వునియందు సహజ వర్ధమాననిరంతర ధ్యానరతుండై॥ సీ॥ శ్రీవల్లభుండెదు
ర్చేరిన యట్లైన జెలికాండ్రి నెవ్వరి జేరమఱచు। సురారితన ముందాల గాఢిన
ట్లైన ననురబాలురతోడ మఱచు। భక్తవత్సలుఁ డసంభాషించినట్లైన నగర
భాషణములు మాటఁ బలుక వెఱచు। సురవంద్యు దనలోన సజూచినయట్లైన నాలోకి
వస్తంబు జూడ మఱచు। హరిపదాంభోజయుగ చింతనామృతమున। నంతరం
గంబు నిండినట్లైన నతఁడు। నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి। జడతలే
కయుండును జడునిభంగి॥ శా॥ పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భా
షించుచున్ హాసలీ। లానిద్రాదులు సేయుచుందిరుగుచున్ లక్షించుచున్ సంతత। శ్రీ
నారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం। ధానుండై మఱచున్ సురా
రిసుతుఁడేతద్విశ్వమున్ భూవరా॥ సీ॥ వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై యొకచో
టు నేడ్చుచు నొక్కచోట। నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై పా
డు నొకచోట। విష్ణుఁడింతియకాని వేఱొండు లేదని యొత్తిలి నగుచుండు నొకచో
ట। నలినాక్షుఁ డని ధ్యానమునఁ గంటి నేనని యుబ్బి గంతులు వైచు నొక్కచోట
బలుకు నొక్కచోట బరమేశ గేశవ। ప్రణయహర్షజనితబాష్పసలిల। మిళితపు
లకుఁడై నిమీలితనేత్రుఁడై। యొక్కచోట నగుచు నూరకుండు॥ వ॥ ఇట్లు పూర్వజ
న్మపరమభాగవతసంసర్గసమాగతంబైన ముకుందచరణారవిందసేవాతిరేకం
బున నఖర్వనిర్వాణభావంబు విస్తరించుచు నప్పటప్పటికి దుర్జనసంసర్గనిమి
త్తంబు నందనచిత్తంబు న్యాయత్తంబు గాక నిజాయత్తంబు సేయుచు నప్రమత్తుం
డు సంసారనివృత్తుండును బుధజనవిధేయుండును మహాభాగధేయుండును సు
గుణమణిగణగరిష్ఠుండును పరమభాగవతశ్రేష్ఠుండును గర్మబంధలతాలవి
త్రుండును బవిత్రుండునైన పుత్రునియందు విరోధించి సురవిరోధి యనుకంపలేక
చంపం బంపెనని పలికిన నారదునకు ధర్మజుండిట్లనియె॥ శా॥ పుత్రుల్నేరని సేరకు
జ్ఞ జనకుల్పోషింతురెల్లప్పుడు। న్మిత్రత్వంబున బుద్ధిఁ జెప్పుదురితో ద్వేషంబువా
రింతురే। శత్రుత్వంబు వలంపరిట్టియెడ నా సౌజన్యరత్నాకరుం। బుత్రున్ శ్లోకప
విత్రుఁ దండ్రి మిగుల న్బాధింప నెట్లోర్చెనే॥ ఉ॥ బాలుఁ బ్రభావిశాలు హరిపాదప
యోరుహచింతనప్రియా। లోలుగృపాళుసాధుగుణలోకపదానతఫాలు సమ

లశ్రీలుసమస్తసభ్యనుతశీలువిఖండితమోహవల్లికాజాలున దేలతండ్రివదజం
పగబంపుమునీంద్రసెప్పవే॥ అనినారదుండిట్లనియె॥ శా॥ లభ్యంబైనసురాధిరా
జపదముల్ లక్షింపఁడశ్రాంతమున్ సభ్యత్వంబునమన్నవాడబలుఁడైజాడ్యంబు
తోఁపిఁడువిద్యాభ్యాసంబునఁగానితిప్రమతిగాడంచున్విచారించిదైజాడ్యంబు
డొక్కదినంబునంబ్రియసుతున్వీక్షించిసోత్కంఠుఁడయి॥ క॥ చదువనివాఁడజ్ఞుం
డగు। జదివినసదసద్వివేకచతురతగలుగుం। జదువఁగవలయునుజనులకు। జ
దివించెదనార్యులొద్దజదువుముతండ్రీ॥ వ॥ అనిపలికియసురలోకపురోహితుం
డగుశుక్రాచార్యులకొడుకులబ్రచండామర్కులరావించి సత్కరించిఇట్లనియె॥
శా॥ అంధపక్షియనున్నవాఁడుపలుకండస్మత్ప్రతాపక్రియాగ్రంధంబించుక
లేమిమీరుగుణవ్యక్తారుణ్యచిత్తుల్మనోబంధుల్మాన్యులుమాకుఁబెద్దలు మ
హిమంబాటించిఈబాలకున్గ్రంధంబుల్చదివించినీతికుశలుంగాఁజేసిరక్షింపరే॥
వ॥ అనిపలికివారలకుంబ్రహ్లాదునప్పగించితోడ్తోనిపాండనినవారునదనుజరా
జకుమారునింగొనిపోయి యతనికిసవయస్కులగుసహశ్రోత్రియులైనయసురకుమా
రులంగొందరంగూర్చి॥ ఉ॥ అచ్చితభక్తితోడదనుజాధిపగేహసమీపమందుబ్ర
వేశించిసుగారిరాజసుతుఁజేకొనిశుక్రకుమారకుల్పఠింపించిరిపాఠయోగ్యము
లుపెక్కులుశాస్త్రములాకుమారుడా। లించిపఠించెనన్నియుఁజలింపనివైష్ణవ
భక్తిపూర్ణుడై॥ క॥ ఏపగిదివారుసెప్పిరినాపగిదిం జెప్పఁగా నిట్టనియాఁక్షేపిం
పడుతానన్నియుఁ రూపించినమిథ్యలనిరూఢమనిషన్॥ శా॥ అంతంగొన్నిదినం
బులేగినసురేంద్రారాతిశంకాన్వితాస్వాంతుండైనిజనందనుంగురువులెజాడం
బఠింపించిరో। భావింతుం జేమిపఠించెనోపిలిచిసంభాషించివిద్యాపరిశ్రాంతిం
జూచెదగాకనేడనిమహాసౌధాంతరాసీనుఁడై॥ ఉ॥ మోదమతోడదైత్యకుల
ముఖ్యుఁడురమ్మనిచీరబంచెబ్రహ్లాదకుమారకున్బనమహర్ణవతారకుఁగామరో
షలోభవిరోధిసద్గపరిహారకుగేశవచింతనామృతాస్వాదకరోరకుంగలు
షజాలమహోగ్రవనీధారకున్॥ వ॥ ఇట్లుచారులచేత నాహూయమానుం
డై ప్రహ్లాదుండుచనుదెంచిన॥ శా॥ ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమేయుద్యో
మారూఢసంవిత్సంపన్నుడవైతివేచదివితేవేదంబులున్శాస్త్రముల్ వ్యాత్సార
మ్మంజేరజేటికోడుకువాత్సల్యసంపూర్ణుడై। యుత్సంగాగ్రముజేర్చిదానవవి
భుండుత్కంఠదీపింపఁగన్॥ క॥ అనుదినసంతోషణములు। జనితశ్రమతాపదుః
ఖసంశోషణముల్। తనయులసంభాషణములు। జనకులకుంగర్ణయుగళసద్భూష
ణముల్॥ వ॥ అనిమరియుబుత్రాసీకేతునవిభ్రమంబైయున్నది చెప్పుమనిపలుక

యుఁజెప్ప నేర్చెఁ దగదా గ్రంథార్థముల్దుర్వృత్తై। యన్నా యెన్నఁడు నీవు నీతి మాతి
వాదంబున్మహావాంఛతో। నున్నాఁడన్ననుఁ గన్నతండ్రి భవదీయోత్కర్షతఁ జూవ
నే॥ వ॥ అనినఁ గన్నతండ్రికిఁ బ్రియనందనుండైన ప్రహ్లాదుండిట్లనియె॥ క॥ చదివిం
చిరి నను గురువులు। చదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నే। జదివినవి గలవు పె
క్కులు। చదువులలో మర్మమెల్ల జదివితి తండ్రీ॥ మ॥ తనుహృద్భాషల సఖ్యము
శ్రవణము మందానత్వము స్సందనా। ర్చనము ల్సేవయు నాత్మలో నెఱుకయున్సం
కీర్తనల్చింతనం। బనునీతొమ్మిది భక్తిమార్గంబుల సర్వాత్మకున్ హరి నమ్మి సజ్జ
నుఁడై యుండుట భద్రమంచుఁ దలంతున్ సత్యంబు దైత్యోత్తమా॥ శా॥ ఆం ఛందో
దయము ల్మహాబధిర శంఖారావముల్మ్రాకస్రగ్గంధ ఖ్యాపనముల్నపుంసకవ
ధూకాంతల్ఘృతభస్మావలీ। బంధుత్వంబులు భస్మ హవ్యములు లుబ్ధద్రవ్యము
ల్క్రోధన। దగ్గంధంబుల్హరిభక్తివర్జితులు రిక్తవ్యర్థసంసారముల్॥ సీ॥ కమలా
క్షునర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ। సురరక్షకుని
జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము। విష్ణునాకర్
ణించు వీనులు వీనులు మధువైరి దవిలిన మనము మనము। భగవంతు వలగొను
పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి। దేవదేవుని జింతించు దినము
దినము। చక్రహస్తుఁ బ్రకటించు చదువు చదువు। కుంభినీధవు జెప్పెడి గురుడు గురు
డు। తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి॥ సీ॥ కంజాక్షునకుఁ గాని కాయంబు కా
యమే పవనగుంభిత చర్మభస్త్రి గాక। వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక। హరిపూజనము లేని హస్తంబు హస్తమే తరుశా
ఖనిర్మిత దర్వి గాక। కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రము
లు గాక। చక్రిచింత లేని జన్మంబు జన్మమే। తరళసలిల బుద్బుదంబు గాక। విష్ణుభక్తి
లేని విబుధుండు విబుధుఁడే। పాదయుగముతోడి పశువు గాక॥ సీ॥ సంసార జీమూ
త సంఘంబు విచ్చునే చక్రిదాస్యప్రభంజనము లేక। తాపత్రయాభీల దావాగ్ని
లార్పనే విష్ణుసేవామృతవృష్టి లేక। సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే హరివనీ
పాబడబాగ్ని లేక। ఘవిపదాత్యంధకారంబు లడఁగునే పద్మాక్షునుతిరవిప్రభ
లు లేక। నిరుపమాపునరావృత్తినిష్కళంక। ముక్తినిధిఁ గానవచ్చునే ముక్తుఁడైన
కంజకోదండచింతనాంజనము లేక। తామరసగర్భునకునైన దానవేంద్ర॥ వ॥
అని యివ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక తనకుఁ జెడిపలికెడి కొడుకు నుడువులు వె
ఫులను విని కులమనోవిన గటములదర బెదవులు గఱచుచు నదరిపడి గురుసుతు
ని గనుంగొని నిమితకధన బుద్ధి గరపినాఁడవని దానవేశ్వరుండిట్లనియె॥ చ॥ వ

ఘుతరనీతిశాస్త్రచయ వారగు జేసెదనంచు బాలునిన్। వటుగొనిపోయి వారికిన న
త్వాముతైనవిరోధిశాస్త్రము। ల్కుటిలత జెప్పినాడవు భృగుప్రవరుండ! టంచు
నమ్మితిం। గటకట బ్రాహ్మణాకృతివిగాక యథార్థవు బ్రాహ్మణుండవే॥ క॥ ధర్మే
తరవర్తనులును। దుర్మంత్రులునై నజనులదుఃతములొందు। న్సర్మములుకల
చికల్మష। కర్మలరోగములునొందుకైవడి విప్రా। అని రాజునకుం బురోహితుం
డిట్లనియె॥ ఉ॥ తప్పులు లేవు మావలన దానవనాథ విరోధశాస్త్రము। ల్సెప్ప
క్రూరులైనరులు సెప్పరు మీచరణంబులానసు। మ్మెప్పుడు నీకుమారకు నింత
యునైపమనీవ యెవ్వరుం। జెప్పెడివారుగాదు ప్రతిచి తదలంపు మునేర్పు నవ్వ
డిటె॥ క॥ పుత్రులము పురోహితులము। పాత్రులమే మదియుగాక భార్గవు ముని
పుత్రుని నిటువలె జేయుద। శత్రులమే దైత్యజలధిచంద్రమ వింటే॥ వ॥ అనిన గు
రునందనుం గోపపక దైత్యవల్లభుండు కొడుకున వలోకించి యిట్లనియె॥ క॥ వా
జ్జలు సెప్పనియీ మతి। మజ్జాతుడవైన నీకు మరియెవ్వనిచే। నుజ్జాతమయ్యె బాల
క। తజ్జనులం జేరుగొను మతగనా మ్రోలన్॥ వ॥ అనిన దండ్రికి బ్రహ్లాదుండిట్లని
యె॥ ఉ॥ అచ్చపుజీకటింబడి గృహవ్రతులై విషయప్రమత్తులై। చచ్చుచుబుట్టు
చున్సలుపజర్విత చర్వణులైన వారికిం। జెచ్చెర బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛ
నైననే। మిచ్చిననైన గానలకు నేగిననైన హరిప్రబోధముల్॥ ఉ॥ కాకని వాని
నూతగొని కానని వాడు విశేషవస్తువుల్। గానని భంగి గర్మములు గైకొని కొందరు
కర్మబద్ధులై। కానరు విష్ణు బొందరటగంతురకించనవైష్ణవాంఘ్రిసం। స్థానరజో
భిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా॥ శా॥ శోధింపంబడెనర్వశాస్త్రము
లురక్షోనాథ వెయ్యేటికి। న్గాథల్మాధవ శేముషీతరణసాంగత్యంబునం గాకదు।
ర్మేధం దాటగవచ్చునే మునువధూమీనోగ్రవాచామన క్రోధోల్లోల విశాలసం
సృతిమహాఘోరామితాంభోనిధిన్॥ వ॥ అనిపలికిన కొడుకును దిక్కరించి మ
త్కృతసేయుకరక్కసులరేడు తనతొడలపైనుండనీక గొబ్బున దిగద్రొబ్బి నిబ్బ
రంబగు కోపంబు దీపింప వేడిచూపుల మింటమంట లెగయ మంత్రులం జూచి యిట్ల
నియె॥ శా॥ క్రోడంబై పినతండ్రి జంపెనని తా గ్రోధించి చిత్తంబులో। వీడం జే
యడు బంటుభంగి హరికిన్ ద్వేషికిన్ భృత్యుడై। వాడం జకటపాళి వాయువు
లు వీడొప్పించుచున్నాడు నా। తోడన్ వైరము పట్టె పుట్టిజనక ద్రోహిన్మహిం
గంటిరే। అని రాక్షసవీరుల వీక్షించి యిట్లనియె॥

హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని వధావివిధోపాయంబుల శిక్షించుట,

శా॥ పంచాబ్దంబుల వాడు తండ్రినగునా పక్షంబు నిందించెయో। త్రుంచిద్బ్

గాని త్రిపురంబులు దైగప్పినప్పుడు తద్బాణపావక హేతిసందోహ దందహ్య మానులైన త్రిపురనివాసులం దెచ్చి మహాయోగియైన మయుండు సిద్ధరస కూపకంబున వైచిన॥ క॥ సిద్ధామృతరసమహిమను। శుద్ధమహావజ్రతుల్యశోభితతనులై। వృద్ధిం బొందిరి దానవు లిద్ధతటిద్ఘాతపావకోపములగుచున్॥ క॥ కూపామృతరససంగతి। దీపితులై నిలిచియున్న దేవాహితులన్। రూపించి చింతనొందెడ। గోపధ్వజుడు చికిత్సకు నానాన్వితుడై॥ ఉ॥ ఉత్సాహంబున నాకలిం బాడి బుద్ధపై యూథంబు ఘూర్ణించుచున్। వత్సంబై తనవెంట బ్రహ్మ నడవన్ వైకుంఠుం డేతెంచియు। ద్వృత్తిం ద్వంబు నకూపమధ్యరసముం ద్రావెన్ విలోకించుచున్। దత్సౌభాగ్యనిమగ్నులై మఱచిరా దైత్యాన్వవారింవఁగన్॥ వ॥ ఇట్లు విష్ణుండు గోమహాకారంబున ధేనువై వచ్చి త్రిపురమధ్య కూపామృతరసంబు ద్రావిన నెఱింగి శోకాకులచిత్తులై నరసకూపపాలకులం జూచి మహాయోగియైన సురుండు వేఱుగుపడి దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె॥

గీ॥ అమరులైన దనుజులైన నరులైన। నెంతనిపుణులైన నెవ్వరైన
దైవికార్థచయము దప్పింపగా లేడు। వలదు దనుజ రావగదలనకు॥

వ॥ అని పలికెనంత విష్ణుండు నైజ బలమైన ధర్మజ్ఞాన విద్యాతపోవిరక్తిసమృద్ధిక్రియాశక్తి నిశేశంబులు శంభుతికి భ్రాతృత్వంబు సమర్పించి రథసూతకేతు వర్మవాహన బాణబాణాసన ప్రముఖసంగ్రామసాధనంబులు జేసి సన్నైకొని॥ మ॥ శరియై కార్ముకియై మహావచియై సన్నాహియై వాహియై। నరథుండై నియంతయైన సబలుండై సత్కేతు చ్ఛత్రియై। పరమేశుండొక బాణమున్విడిచె దీదదానానలజ్వాలలం। బురములు గాలె జటచ్చటాధ్వనిన భోభూమధ్యమున్నిండగన్॥ వ॥ ఇట్లు వారు దుర్నవగాహంబులైన త్రిపురంబులన భిజిన్ముహూర్తంబున భస్మంబుజేసి కూల్చిన నమరగరుడగంధర్వసిద్ధసాధ్య యక్షవల్లభులు వీక్షించి జయజయ శబ్దంబులు సేయుచు గుసుమంబులు గురిసిరి పితృజలు హర్షించిరి బ్రహ్మాదులు గీర్తించిరి యప్సరసలు వర్తించిరి దివ్యకాహళ దుందుభిరవంబులును మంగళోత్సవంబులు ప్రచురంబులయ్యె నిట్లు విశ్వజనీనంబగు త్రిపురాసుర సంహారంబున నఖిలలోకులు సంతోసిల్లియుండ నయ్యవసరంబున॥

గీ॥ తొలిదికముఖభంగి త్రిపురంబుల హరించి। పరముడవ్యయుండు గోత్రియశుడు। శివుడువర్మజాగిచేగియమానుడై। నిజనివాసమునకు నెమ్మి జనియె॥ వ॥ ఇట్లు నిజమాయావిశేషంబున మర్త్యలోకంబు విడంబించుచు

తన్నాతు లేవ్వరకుజంబాల వృత్తనమాతంగజాతులకును నాయాకులాగతం
బులయిన వృత్తులు, చౌర్యహింసాదులు వర్జించి సంచరింపవలయు మానవుల
కు బ్రతియుగంబునయిన సర్గకంబులయిన ధర్మంబులు రెండులోకంబులం
దుసుఖకరంబులని వేదవిదులయిన పెద్దలు సెప్పుదురు కారుకారున దున్నడు
క్షేత్రంబు లావుచెడునందు జల్లినబీజంబులు నిస్తేజంబులయియుండి లెస్సగ
నంకురింపవు నిరంతరఘృత ధారావర్షంబున దహనంబునకు దాహకత్వం
బు లేక శాంతిం జెందునందు వ్రేల్చినహవ్యంబులు ఫలింపవు తద్విధంబున ననవ
రత కామానుసంధానంబునగా మోక్షముఖంబయినచిత్తంబు కామంబుల
దనిసి నిష్కామంబై విరక్తినొందుగావున సత్త్వస్వభావంబుతోడ నెవ్వడు
దప్పక నిజవంశానుగతవిహితధర్మంబున వర్తించునరుండు మెల్లన స్వాభా
వికకర్మపరత్వంబు విడిచి ముక్తినొందుజాతిమాత్రంబున బగుసువర్ణం
బని దేశింపలేదు శమదమాదివర్ణలక్షణవ్యవహారంబుల గనవలయునని
నారదుండిట్లనియె॥ క॥ క్రమమున వర్ణంబులచే। ధర్మములెల్లను జెప్పబడి
యె నాశ్రమముల। ధర్మము లెరిగించెదనన్నియు। సమదాహితహృదయ
శూలనదమశీలా॥ వ॥ వినుము బ్రహ్మచారి మౌంజీకౌపీనయజ్ఞోపవీతకృష్ణా
జినపాలాశదండకమండలుధరుండును సంస్కారహీన శిరోరుహుండును ద
ర్భహస్తుండును శీలప్రశస్తుండును మౌనియునయి త్రిసంధ్యంబుల బ్రహ్మగాయ
త్రి జపియించుచు సాయంప్రాతరవసరంబుల నర్కపావకగురుదేవతోపాసనం
బులు సేయుచు గురుమందిరంబునకుం జని దాసునిచందంబున భక్తివినయసౌ
మనస్యంబులుగలిగి వేదంబులు సదువుచు సద్యయనోపక్రమావసానంబుల
గురుచరణంబులకు నమస్కరించుచు రేపుమాపునువిహితగృహంబుల భిక్షి
ంచి భైక్షంబు గురువునకు నివేదించియనుజ్ఞ నామితభోజనంబు గావించుచు వి
హితకాలంబున నుపాసించుచు నంగనయందు నంగనాసక్తులందుం బ్రయోజ
నమాత్ర భాషణంబులొనర్చుచు గురుపరాంగనలవలన నభ్యంగన కేశప్ర
సాధన శరీరమర్దనమజ్జనరహస్య యోగంబులు వర్జించుచు గృహంబున
నుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుండయి సంచరింపవలయు॥ గీ॥ పొ
లతి దావవహ్నిపురుషు డాజ్యఘటంబు। గాగకుండరాదంగదిసెనే। బ్రహ్మయు
యునగూతు బట్టకమానడు। వటువకింతిపొత్తు వలదువలదు॥ వ॥ వినుము స్వ
రూప సాక్షాత్కారంబున దేహ బహిరింద్రియాదికంబయిన యంతయునా
భాస మాత్రంబుగా నిశ్చయించి యెందాక జీవుండు స్వతంత్రుండయి సయా

శ్వరుండుగాఁడు దనంతదశేవుఁడంగనయిది పురుషుండు నేనని యెడి బుద్ధిగా
నుట కర్తవ్యంబు బ్రహ్మచారి యతిథిగృహస్థులందెవ్వఁడైన జిత్తంబు
వశ్యంబుగాక నద్వైతానుసంధానంబు సేసిన మూఢుఁ డగుఁ గావున రహస్యం
బును బ్రతికనైన జాయకుండవలయు॥ చ॥ శిరమున మేనసంస్కారతులు సేయక
చందనభూషణాద్యలం। కరణము లెల్ల మాని బుతుకాలముల న్నిజభార్యఁ బొందు
చుం। దరుణులఁ జూడ కాలక దృఢవ్రతుఁడై మధుమాంసవర్జితుఁడై। గురుతరవృ
త్తితో మెలఁగుకోవదుఁ డాకృ గృహస్థభూవరా॥ వ॥ మఱియు ద్విజుండు గృహ
స్థుఁడై గురువులవలన నుపనిషదంగసహితంబు న నేదమంత్రంబును బఠియించి
నిజాధికారానుసారంబు నసర్థవిచారంబు జేసి తనబలంబు కొలంది గురువుఁ కున
భీష్టంబులొసంగి గృహంబు నొండె నైష్ఠికత్వంబు నాశ్రయించి ప్రాణులతోడ
జీవించుచు గురువునందు నగ్నియందు నాత్మయందు సర్వభూతంబులందున మూర్తి
తద్దర్శనంబు జేయుచు నింద్రియవ్యసనాదిమగ్నుండుగాక యెఱుక గలిగి వర్తిం
చుచు పరబ్రహ్మంబు నొందు॥ క॥ విను మూవానప్రస్థుఁడు। మునికథితములైన
యమనియములు గలవాఁడ। వ్యనవనగతుఁడై మెలఁగు। ఘనుఁడు మహాలోకమున
కుఁగ వనించి ప్రముదా॥ వ॥ అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనమునకుం జనిదున్న
కవండెముని వారాదికంబులగ్నిపక్వంబు చేసియుండెనాపు బుసేసి యుండె
ర్కపక్వంబున ఫలైలాదులొండె నట్టించుచు వన్యాహారంబులు నిత్యకృత్యంబు
లయిన చరుపురోడాశంబులొనర్చుచు ప్రతిదినంబు నంబరార్జసంచితంబులు పరి
త్యజించి నూతన ద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్నికొఱకు పర్ణశాలయైన
పర్వతకందరంబయిన నాశ్రయించుచు హిమవాయువహ్ని వర్షాతపంబులకు స
హించుచు నఖశ్మశ్రు కేశతనూరుహంబులు పరిసాధితంబుల సేయక జటిలుం
డై యువసించుచు దండాజినకమండలు వల్కలపరిచ్ఛదంబులు ధరి
యించి పండ్రెండయిన నెనిమిదయిన నాలుగైన రెండయిన నొకవత్సరంబ
యిన తపఃప్రయాసంబున బుద్ధిభ్రంశంబు గాకుండ మునియై యుచరించుచు మద
యువవశంబున జరారోగంబులచేతఁ జిక్కి నిజధర్మానుష్ఠానసమర్థుండు
గాని సమయంబున నిరశనవ్రతుండై యగ్నుల నాత్మారోపణంబు సేసిన
న్యసించి యాకాశంబు నందు శరీరరంధ్రంబులు గాలియందు నిశ్వాసంబును
దేజంబులోపల నూష్మంబును జలంబులరసంబును ధరణియందు శల్యమాంస
ప్రముఖంబులును వహ్నియందు వక్తంబుతోడ వాక్కు నింద్రునియందు శి
ల్పంబుతోడ హస్తంబును విష్ణునందు గతితోడ బదంబులును బ్రజాపతియం

డు. తితోడను హస్తంబును మృత్యువునందు విసర్గంబుతోడ వాయువునుదిక్కు-
లందు శబ్దంబుతోడ శ్రోత్రంబును వాయువునందు స్పర్శంబుతోడ త్వక్కును
సూర్యునియందు రూపంబుతోడ చక్షువులును సలిలంబునందుఁ బ్రచేతస్స
హితయయిన జిహ్వయు క్షితియందు గంధసహితంబయిన ఘ్రాణంబును
చంద్రునియందు మనోరథంబులతోడ మనంబును కవియయిన బ్రహ్మయం
దు బోధంబుతోడ బుద్ధియు రుద్రునియందహంకారంబుతోడ మమ
త్వంబును క్షేత్రజ్ఞునియందు సత్త్వంబుతోడ జిత్తంబును జేరిచి యట
మీఁద బృథివి నుండు బృథివిని జలంబునందు జలంబును తేజంబు నందు తేజంబు
నువాయువందు వాయువును గగనమందు గగనము నహంకారతత్త్వమందు న
హంకారమును మహత్తత్త్వమునందు మహత్తత్త్వమును బ్రకృతియందు
బ్రకృతిని నక్షరుండయిన పరమాత్మయందును లయంబునొందించి చిన్మాత్రా
వశేషితుండయిన క్షేత్రజ్ఞుండగు తన్ను నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుం
డై దగ్ధకాష్ఠుండగు వహ్ని చందంబున బరమాత్మయైన నిర్వికార పరబ్రహ్మం
బునందు లీనుండగావలయు. క. అనఘ వనప్రస్థుండయి చతుర్థమార్గంబు లిట్లున
లుపుమహితీయాన్మనెనేని సన్న్యసింపం జనున టమీఁద ముక్తిసంగత్వము
నకు. వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరిపి సన్న్యసించి దేహమాత్రావశి
ష్టుండును నిరపేక్షుండును భిక్షుండును నిరాశ్రయుండును నాత్మారాముం
డును సకలభూతసముండును శాంతుండును సమచిత్తుండును నారాయణప
రాయణుండునై కౌపీనంబును నాచ్ఛాదనమాత్రంబైన వస్త్రంబును ధరియించి
దండాదివ్యతిరిక్తంబులు విసర్జించి యాత్మపరంబులుగాని శాస్త్రంబులు వ
ర్జించి గ్రహనక్షత్రాది విద్యలఁ జీవింపక భేదవాదంబైన తర్కంబులఁ దరిం
పక నెందును బక్షీకరింపక శిష్యులకు గ్రంథంబులు వచించి యుపన్యసింపక బ
హువిద్యల జీవింపక మఠాది వ్యాపారంబుల నుల్లసిల్లక పెక్కుదినంబు లొ
క్కెడ వసియింపక యూరనూర నొక్కొక్క రాత్రి నిలుచుచు గార్యకారణ
వ్యతిరిక్తంబైన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు సదసన్మయంబైన విశ్వం
బునందు పరబ్రహ్మంబైన యాత్మనవలోకించుచు జాగరణ స్వప్న సంధిసమయం
బుల నాత్మనిరీక్షణంబు సేయుచు నాత్మకు బంధమోక్షంబులు మాయామాత్రం
బులు గాని వస్తుప్రకారంబున లేవనియును దేహంబునకు జీవితంబు ధ్రువంబు
గాదనియును మృత్యువు ధ్రువంబని యెఱుంగుచు భూతదేహంబుల సంభవనా
శంబులకు మూలంబైన కాలంబుఁ బ్రతీక్షించుచు నివ్విధమున సజ్జనోత్పత్తి

బని పలుకుదురు దేవఋషులును బ్రహ్మపుత్రులగు సనసనకాదులునుండ భవ
దీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుండయ్యె ననేకజంతుసం
ఘాతసంకీర్ణంబైన బ్రహ్మాండపాదపంబునకు నారాయణుండు మూలంబు త
న్నిమిత్తంబున నారాయణసంతర్పణంబు సకలజనసంతర్పణంబని యెఱుంగు
ము ఋషినరతిర్యగమరశరీరంబులు పురంబులు వానియందు దారతమ్యంబు
లతోడ జీవరూపంబున భగవంతుడైన హరి వర్తించుటం జేసి పురుషుండన బ్ర
సిద్ధుండయ్యె నందు తిర్యగ్జంతులకంటె నధికత్వంబు పురుషునియందు విలసి
ల్లుటం జేసి పురుషుండు పాత్రంబు పురుషులలోన హరితనువైన వేదంబు ధ
రించుచున్న తోడ విద్యాతపోగరిష్ఠుడైన బ్రాహ్మణుండు పాత్రంబు బ్రాహ్మ
ణులలోన నాత్మజ్ఞాన పరిపూర్ణుండైన యోగి ముఖ్యపాత్రంబని పలుకు
దురు పరస్పరపాత్రంబులకు సహింపని మనుష్యులకు పూజనార్థంబు త్రేతాయు
గంబునందు హరిప్రతిమలు గల్పింపబడియెఁ గొందఱు ప్రతిమార్చనంబు
జేయుదురు పురుషశ్రేష్ఠులయిన వారలకుఁ బట్టి ప్రతిమార్చనంబు ముఖ్యా
ర్థప్రదంబు గాదు మంతాధికారులకు బ్రతిమార్చనంబ పురుషార్థప్రదం
బగు॥ గీ॥ అఖిలలోకములకు హరి దైవతము సూడ। హరికి దైవతము ధరాధి
నాథ। పదపరాగలేశపంక్తి చేతఁ ద్రిలోక్య। పావనంబుఁ జేయు బ్రాహ్మణుండు॥ వ॥
అట్టి బ్రాహ్మణజనులందు గర్మనిష్ఠులు తపోనిష్ఠులు వేదశాస్త్రనిష్ఠులు జ్ఞానయో
గనిష్ఠులు నై కొందఱు వర్తింతురందు జ్ఞాననిష్ఠునికి ననంతఫలకామి నియైన గృహ
స్థుడు పితృజనులను ద్దేశించి కవ్యంబులును దేవతలను ద్దేశించి హవ్యంబులును బె
ట్టుట ముఖ్యంబు దైవకార్యంబునకు నిరువుర నైన నొకరి నైన బితృకార్యంబుని
కు మువ్వుర నైన నొకరి నైన భోజనంబు సేయింపవలయు ధనవంతుండైన శ్రాద్ధవి
స్తారంబు గర్తవ్యంబు గాదు దేశకాలప్రాప్త కందమూలఫలాదికంబైన
హరి నైవేద్యంబున విధిచోదితప్రకారంబ గా శ్రద్ధతోడం బాత్రంబునందుఁ బె
ట్టిన యన్నంబు కామదంబయి యక్షయఫలకారి యగు ధర్మతత్త్వవేదియైన వాడు
శ్రాద్ధంబులందు మాంసప్రదానంబు జేయక భక్షింపక చరింపవలయు గందమూ
లాది దానంబునను సౌఖ్యడిఫలంబు పశుహింసనంబున సంభవింపదు ప్రాణిహిం
స జేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు యజ్ఞవిదులైన ప్రోడలు
నిష్కాములై బాహ్యకర్మంబులు విడచి యాత్మజ్ఞానదీపంబులందు గర్మ
మయంబులైన యజ్ఞంబుల నాచరింతురు॥ క॥ పశువుల బొరిగొని మఖ
ములు। విశదముగఁ జేయు బుధుల వీక్షించి తమున్। వ్రేసెద రసనము జేయు

నోయసి। తనిమసి బెగడొందు భూతగణమున రేంద్రా ॥ వ ॥ అదిగావున ధర్మవేదియైన వాఁడు దైవప్రాప్తంబు లయిన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తిక్రియలఁ జేయవలయు నిజధర్మబాధకంబైన ధర్మంబును బరధర్మ ప్రేరితంబైన ధర్మంబు నాభాసధర్మంబును బాషండధర్మంబు నుపధర్మంబు కపటధర్మంబును ధర్మజ్ఞుండైనవాఁడు మానవలయు నైసర్గికధర్మంబు దురితశాంతిక రంబగు నిర్ధనుండు ధర్మార్థంబు యాత్ర సేయుచున్నను ధనంబుఁ గోరవలదు జీవనోపాయంబునకై నిట్టట్టుదిరుగక గార్హస్థ్యంబు సేయుచు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముఁడయియుండవలయు. గోరక బ్రతికెడి సుగుణునికిఁ గల సుఖంబు కామలోభంబు లందశదిశలం బఱిధావనంబు జేయువానికి సిద్ధింపదు పాదరక్షలు గలవానికిఁ గర్కశ కంటకాదులవలన భయంబు లేక మెలంగు తెఱంగి గామంబుల వలన నివృత్తి గలవానికి నెల్లకాలంబును భద్రంబగును జిహ్వాదయిస్థంబునకును బుభుక్షుండు గృహపాలక శునకంబు కయివడి సంచరించుచు సంతుష్టి లేకచెడు సంతోషిగాని విప్రునికి విద్యాతపోవిభవయశంబులు నిరర్థకంబులగు నింద్రియలోలత్వంబున విజ్ఞానంబు నశించు సకలభూలోక భోగంబులు భోగించియు దిగ్విజయంబు సేసియు బుభుక్షాపిపాసలవలన గామపారంబును హింసవలన గామవారంబును హింసవలన క్రోధపారంబును జేరటదుర్లభంబు సంకల్పవర్జనంబున గామంబును గామవర్జనంబున క్రోధంబును నర్థానర్థదర్శనంబున లోభంబును ద్వయితా సంధానంబున భయంబు నాత్మానాత్మవివేకంబుల శోక మోహంబులును సాత్త్వికసేవనంబున దంభంబును మౌనంబున యోగాంతరాయంబును శరీరవాంఛ లేమి హింసయు హితాచరణంబున భూతజయంబైన దుఃఖంబును సమాధిబలంబున దయివికవ్యథయును ప్రాణాయామాదికంబుల నాత్మవ్యథయును సాత్త్వికాహారంబుల నిద్రయు సత్త్వగుణంబున రజస్తమంబులును గురుభజనకుశలుండయి శీలంబున జయింపవలయు ॥ క ॥ హరిమహిమత లకు జెప్పెడి। గురువున్నరుడనుచు దలచి కుంఠితభక్తిన్। దిరుగువు రుషుండ్రశము మెల్లను। గరిశౌచము క్రియనిరర్థకంబగు నధిపా ॥ ఉ ॥ యౌవనజాత నేత్రకుంబర మే శుమహాత్మ్య బ్రధానపూరుషున్। దేవశరణ్యు సజ్జన ధ్యేయుఁ బదంబు జరాగి యోగిసంసేవిత పాదపద్ము దమచిత్తము లన్నరుడంచు లోకులి। చ్ఛాదవిచారించు దుదుపసన్మతి లేకన రేంద్రమా ॥ వ ॥ వినుము షడింద్రియంబుల యందు తత్పరులయి చ్ఛాపూరణ విధానంబుల జరితార్థులమైతిమను వార

విషయ శత్రుమధ్యంబునం గూల్చిన॥గీ॥విషయశత్రులెల్ల విక్రాంతితోడ సా।
రధిసమేతు డైనరధికు బట్టి।యుగ్రనతిరమ్యత్యాయు తమగునంతా । కూలవమ
ధ్యమందుగూల్తురధిప॥

వ ॥ వినువైదికకర్మంబు ప్రవృత్తంబునునివృత్తంబును రెండు తెఱంగులనొప్పు
నందు ప్రవృత్తంబున రానవర్తనంబును నివృత్తంబున మోక్షంబును సిద్ధించు బ్ర
వృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులను రెండుమార్గంబుగలవందు హిం
సాద్రవ్యమయకామ్యరూపంబులైనదర్శపూర్ణమాసపశుయాగవైశ్వదేవ
బలిహరణప్రముఖంబులయిన యాగాదికంబులిష్టంబులు దేవాలయవనకూ
పతటాకప్రముఖంబులుపూర్తంబులు ప్రవృత్తకర్మంబున దేహంబువిడిచి
నంతరారంభంబున దేహాద్యయాగ్రంబునవెలుంగువానితోడ నింద్రియ
యంబులం గూడిభూతసూక్ష్మయుక్తుడగు ధూమమగక్షిణాయనక్రిష్ణపక్ష
రాత్రికళలంబులవలన సోమలోకంబుజేరి భోగావసానంబునవిలీనదేహుం
డయివృష్టిద్వారంబున క్రమంబున దోషధులతాన్నశుక్లరూపంబుల బ్రాపించి
భూమియందుజన్మించునది పునర్భవరూపంబయినపితృమార్గంబు నివృత్త
కర్మనిష్ఠుండైనవాడు జ్ఞానదీపంబులైనయింద్రియంబులందు గ్రియాయజ్ఞం
బుల యాజించి యింద్రియంబులదర్శనాదిసంకల్పరూపంబయినమనంబునం
బునందువికారయుక్తంబయినమనంబును శాకుయందు విద్యాదిలక్షణమై
నవాక్కు మవర్ణశముదాయంబునందును వర్ణసముదాయంబునకారాదు
స్వరత్రయాత్మకంబయినయోంకారంబునందు నోంకారంబును బిందువందు
బిందువును నాదంబు నందునాదంబును ప్రాణంబునందు ప్రాణంబు బ్రహ్మ
మందునిలుపవలయు దేవమార్గంబులయిన యుత్తరాయణశుక్లపక్ష దివా
ప్రాహ్ణపూర్ణిమారాకలవలన సూర్యబ్రహ్మలోకంబులందుజేరి భోగావ
సానంబున స్థూలోపాధి విశ్వుండైనసూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధి
యైనతైజసుండయినసూక్ష్మంబును గారణంబునందు లయించు కారణంబును
సాక్షిస్వరూపంబునందు లయించి తుర్యుండైనసాక్షిలంబునందు శుద్ధాత్ముం
డైయివ్విధంబున ముక్తుండగుచు ॥గీ॥ అమరనిర్మితంబులై యొప్పిపిత్రు దేవ।

ర్యాండనైన నేను సౌందర్య చాతుర్య మాధుర్యగాంభీర్యాదిగుణంబులనుం దరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలయిన బ్రహ్మలు దేవసత్రమనియెడి యాగంబులోన నారాయణకథలు గానంబుచేయు కొఱకునప్సరోజనంబులను గంధర్వులం జీరిన ॥ గీ॥ శ్రుతపురోని కేను గంధర్వగణములోఁ । గలసిపోయి విష్ణుగాథలచటఁ । గొన్ని పాడి సతులఁ గూడి మోహితుఁడనై । తలఁగి చనితినంత ధరణినాథ । క । వారిజగంధుల పొత్తున । వారింగైకొనఁ దలఁగి వచ్చినబుద్ధి । గ్ర్యారెంగి శాపమిచ్చిరి । వారింపగరా నిరోషవశను సదివా ॥ గీ॥ పంకజాక్షు నిచట బాడక కామినీ । గుణముగూడిచని సకల్మషమున । దత్తకాంతివగుచు ధరణితలంబున । శూద్రజాతినతికి సుతుఁడవగుము॥వ॥అనియిట్లు విశ్వస్రష్టలు శపించిననొక్క బ్రాహ్మణదాసి బుత్రుఁడనై జన్మించియుం బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూషణ జేసిన భాగ్యంబునని మహాకల్పంబునందు బ్రహ్మపుత్రుండనయి జన్మించితిగి కౌశలమువ మోక్షగతికి గృహస్థుడే । ధర్మములు చరించితగిలిపోవు। నట్టిధర్మ మెల్లనతివిశదంబుగాఁ । బలుకఁబడితి మునీకు భవ్యచరిత ॥ మ ॥ అఖిలాధారుఁడ జావెమర్థభుండు బ్రహ్మాదె విష్ణుండనీ। మఖమందర్శితుఁడై వాసగతుఁడై మాధుర్యనంభాషియై । సఖియై చారకుఁడై మనోదయితుఁడై సంబంధియై మంత్రియై॥ సుఖదుండవె తథపన్నహామహిమ దాజోద్యంబు ధాత్రీశ్వరా ॥ వ ॥ అనియిట్లు నారదుఁడు చెప్పిన వృత్తాంతంబంతయు వి ధర్మనందనుండు ప్రేమవిహ్వలుండయి వాసుదేవుని బూజించె నాడు దేవ ధర్మనందనుల చేత బూజితుండయి నారదమునియు దేవమార్గంబునం జనియెనని శుకయోగీంద్రుండు పాండవపౌత్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పె॥ క॥ రాజీవసదృశలోచన। రాజీవభవాదిదేవ రాజవినుతవి । భ్రాజిత కీర్తిల తాప్త రాజీవభవాండ భాండరఘుకులతిలకా॥

మాలిని ॥ధరణిదుహితృరంతాధవా మార్గనగంతా ॥ నిరుపమనయవంతా నిర్జరారాతిహంతా । దురుబధసుఖకర్తా కుభినీచక్రభర్తా సురభయపరిహర్తా సుస్థిరోవిహర్తా॥

గద్యము: ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవిచిత్ర కేసనమంత్రిపుత్త్రసహ
జపాండిత్యపోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహా
పురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్షహిరణ్య
కశిపుల పూర్వజన్మవృత్తాంతంబు చెప్పుటయు హిరణ్యకశిపుదితి
సంవాదంబును సుయజ్ఞచరిత్రంబును యమసల్లాపంబును బ్రహ్మవర
లాభగర్వితుండగు హిరణ్యకశిపు చరిత్రంబును ప్రహ్లాదవి
ద్యాభ్యాసకథయును ప్రహ్లాదహిరణ్యకశిపుసంవాదంబును ప్ర
హ్లాదువచనంబు ప్రతిష్ఠించి హరి నరసింహరూపంబున నావి
ర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకభ
యంబిచ్చి నిఖిలదేవతానివహ ప్రహ్లాదాదిస్తూయమా
నుండగుటయు త్రిపురాసురవృత్తాం
తంబును ఈశ్వరుండు త్రిపురంబుల దహించుట
యు వర్ణాశ్రమధర్మ వివరణంబును ప్ర
హ్లాదాజగరముని సంవాదంబును నా
రదు పూర్వజన్మ వృత్తాం
తంబును కథలంగల సప్తము
స్కంధము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు

